# ప్రహ్లాద.

మూడంకముల నాటకము

ఇయ్యది

గంగుల

శ్రీ నారాయణ రెడ్డిగారి

రచితము

గుంటూరు జిల్లా పల్నాడు తాలూకా

వాస్తవ్య ధనసహాయముచే

మొదటికూర్పు 500 ప్రతులు.


నరసారావుపేట

యస్. కోటిరెడ్డి, అండ్ యస్. మహాలాసాహేబు గార్ల

శ్రీకోటీశ్వర ముద్రాక్షరశాలయందు,

ముద్రింపబడినది.

1936.

ఓం.

శ్రీ

# ప్రహ్లాద.

మూడంకముల నాటకము

ఇయ్యది

గంగుల నారాయణ రెడ్డిగారి

రచితము.

గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా భక్తజన ధన
సహాయముచే

మొదటికూర్పు 500 ప్రతులు.

నరసారావుపేట
యస్. కోటిరెడ్డి, అండ్ యస్. మౌలానా సాహెబుగార్ల
శ్రీకోటీశ్వర ముద్రాక్షరశాలయందు,
ముద్రింపబడినది.

1936.

# విజ్ఞప్తి.

చదువరులకు, ప్రహ్లాదచరిత్ర మెరుగని వారలెవ్వరు? ఇది హరికథ రూపముగానో, నాటక పద్ధతిలోనో, లేక భజనపరుల కనుకూలముగానో, నాహృదయములో చిన్నతనమునుండే వ్రాయవలయునని విత్తనము నాటుకొనియెను. ఆవిత్తనము భగవంతుని కృపారసముచే వృద్ధియయ్యెను వృద్ధియయ్యి హరికథలుచెప్పువారికి, నాటకములు ప్రదర్శించువారికి, భజనపరులకు, అనుకూలమవునట్లు యీ నాటకము నాచే వ్రాయించెను. ఆ భగవంతునికి సహస్రవందనములు ప్రహ్లాదుడు తల్లిగర్భములోనుండి నారదునిచే అష్టాక్షరి మంత్రరాజమును గ్రహించుట, శ్రీనృసింహ రూపమున ఉక్కుస్తంభములో నుండి భగవంతు డుద్భవించుట, ఆరూపము బ్రహ్మాది దేవతలే చూచుటకు శక్తి చాలకుండుట, తండ్రికుమారుడు వివాదములో నొకరి నొకరు తగ్గకుండుట, సుగుణరాశియగు లీలావతి పడిన మనోవేదన ఇంద్రుడు తొందరపడి నారదునిచే తెలుసుకొనిన పరిజ్ఞానము హిరణ్యకశిపుని భటులు ప్రహ్లాదుని యినుప బన్దెలచే బాధించి సముద్రములో బడవేయ హరినామస్మరణ జేయుచు లేచి నాట్యము సల్పుచు వచ్చిన మహాతిశయము యిటువంటి విశేషములీ నాటకమున యింకను

పెక్కు గలవు. యీ పుస్తకము అచ్చుబడిన గాని ఆసంగతులన్ని బాగాదెలియ వన్నట్లు బీదవాడయినను మా శిష్యుడు తుమ్మల చెర్వు యెల్లమంద పల్నాడుతాలూకా భక్తజనుల వలన కొంత డబ్బు వసూలుచేసి తాను తనశక్తికొలది భరియించెను సర్వమయుడైన ఆ శ్రీమన్నారాయణమూర్తి యీభక్తుని అన్నివిధముల రక్షించుగాత పిపీలిక బ్రహ్మపర్యంతము సుఖముగా జూచుగాత.

సాతగుడిపాడు
న॥ రా॥ తా॥
ది 2—8—36.

గంగుల నారాయణ రెడ్డి.
గ్రంథకర్త.



# నాంది.



(తండ్రి, కుమారుడు.)

చ॥ శ్రితజన పాలకుండు బిర ♦ శిక్షయొనర్చును కూర్చి మానవా
తతిని మహాత్ములంత ఘన ♦ తత్వవిబోధము జేయన్యాయమూ
మితమవు భోజనంబు మితి ♦ మీరని నిద్రయు సమ్మతంబు నీ
వతి పని పాటలందు జయ ♦ మాశము మెల్లెడ గాంచి నప్పుడే

తండ్రి—ప్రహ్లాదుడు రాక్షస వంశమునందు జన్మించినను శమమే అతనిని యెల్లెడల కాపాడెను.

కుమా—ఈశృంగార మా ముత్యాల హాలులో ప్రజలు క్రిక్కిరిసి యుండిరిదేల. అదియునుంగాక ప్రహ్లాద, ప్రహ్లాద, యను శబ్దములు సందులేక వినవచ్చు చున్నవి.

తండ్రి—ఇంద్రుడు మొదలయిన వారు ప్రవేశించుటకు గాబోలు యిచ్చట సింహాసనములు గూడ అమర్చబడి యున్నవి మృదంగ శబ్దము వినవచ్చుచున్నది ప్రహ్లాదనాటకము ప్రదర్శించ బోవుచున్నారు.

కుమా—ఆ మహాభక్తుని నాటకము వ్రాసిన దెవరై యుండవచ్చును.

తండ్రి—శ్రీ ఆర్యమిత్ర మండలి సభాధ్యక్షుడు గంగుల నారాయణ రెడ్డి.

కుమా—అలాగయిన నృసింహమూర్తి బుట్టి హిరణ్యకశిపుని జంపి ప్రహ్లాద పట్టాభిషేకము వరకు కథయుండును.

తండ్రి—మన మీవేళ్లకి పారమాపి యింటికి బోయి తిరిగి మరల వచ్చెదము.

(యిరువురు నిష్క్రమింతురు.)

# ఈ నాటకమునకు పాత్రలు.

## పురుషులు.

ప్రహ్లాదుడు క॥ నా॥
హిరణ్యకశిపుడు
త్రిమస్తకుడు } మంత్రులు
త్రిలోచనుడు }
చండుడు } ద్వారపాలకులు.
ప్రచండుడు }
యింద్రుడు
వైశ్వానరుడు
యముడు
బృహస్పతి
నారదుడు

} వీరు గురువులు
మార్కుడు }

సువర్ణముఖుడు
రజతాసురుడు    ప్రహ్లాదుని
దంతవక్త్రుడు
రక్తనేత్రుడు    పాఠకులు
తామ్రకేశుడు

గజబలుడు } భటులు
శతబాహుడు }
మంత్రాలపెద్ద రాముడు } వీరు
తక్కిడిబిక్కిడి } పాముల
ఉక్కిడిగాడు } వాండ్రు.
పీరుదాసు }
నృసింహామూర్తి
బ్రహ్మ.

## స్త్రీలు.

లీలావతి.

---



శ్రీరస్తు.

శ్రీ

# ప్రహ్లాద.



## ప్రథమాంకము.

### ప్రథమరంగము - ఆస్థానమండపము.

(ఇంద్రుడు, వైశ్వానరుడు, యముడు ప్రవేశింతురు.)

ఇంద్రు—వైశ్వానరా! భగవత్ప్రార్థనకు గణదేవతాది ముఖ్యులందరు వచ్చియున్నారా!

వైశ్వా—ఒక్కరయిన తరుగులేక రావలసిన వారు యా వన్మంది వచ్చియున్నారు.

ఇంద్రు— కీర్తన.

1. వందే శ్రీదేవదేవ । వందే వైకుంఠవాస
   వందే మముగన్నతండ్రి । వందే ॥ శ్రీ ॥
2. వందేక్షీరాబ్ధిశయన । వందేవటపత్రశాయి
   వందేమముగన్నతండ్రి వందే ॥ వందేశ్రీ ॥
3. వందేభవబంధ రహిత । వందేవనరుహనయన
   వందే మముగన్నతండ్రివందే ॥ వందేశ్రీ ॥
4. వందే హరినారాయణ । వందేవరనారాయణ
   వందేమముగన్నతండ్రి వందే ॥ వందేశ్రీ ॥

గీ॥ రాజ్యసుఖమునుగోరని ♦ పూజ్యులేల
తత్వమెఱుగని కవుల ♦ కవిత్వమేల
నందనులులేని గృహమున ♦ కందమేల
దివిజసోదర వరులార ♦ దివ్యులార.

వైశ్వానర, దండధర, నైఋతి, వరుణ, పవన, కుబేర, సుర, యక్షరక్షో, విద్యాధర, గరుడ, గంధర్వ, కిన్నెర, కింపురుష, సిద్ధసాధ్యులార గణదేవతలార వింటిరా!

వైశ్వా—ఇంద్రా! నీపద్దెము నింకొక్కసారి సెలవిమ్ము.

ఇంద్రు—మరలా నాపద్దెము చదువును.
యిపుడు మన స్వర్గరాజ్యమునకు కష్టము వచ్చునటుల తెలియుచున్నది.

వైశ్వా—అదియేమి కారణమొ తెలియబలుకుము ఇంద్రా!

ఇంద్రు—శ్రీమహావిష్ణు యజ్ఞ వరాహమయి దితి గర్భజనితుండౌ హిరణ్యాక్షుని చంపినాడని వాని యగ్రజుండగు హిరణ్యకశిపుడు మన విష్ణుపయి వైరమెత్తి వైకుంఠంబునకుబోయి నచట విష్ణుంగానక వీర దైత్య దానవులచే భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోక, అతల, వితల సుతల, రసాతల, మహాతల, తలాతల, పాతాళలోకంబు వెతకించె నెందునవిష్ణుంగానక.

గీ॥ సాధుసజ్జనులోనరించు ♦ సంఘములను
ధేనువులుపెక్కు లున్నట్టి ♦ దేశములను
దేవతా క్షేత్రములపుణ్య ♦ తీర్థములను
యాగభోగములందు శ్రీ ♦ హరిని వెతకి.

విసుకుజెంది త్రిమస్తక త్రిలోచన, శకుని, శంబర, శతబాహు, నముచి, హయగ్రీవ, పులోమ, విప్రచిత్తి ప్రముఖులయిన ప్రధాన మంత్రులకు రాజ్యము నొప్పగించి, విష్ణుని సాధించ వలయునను కక్షతో మందరాచల ద్రోణికిజని యందు గాలిపెను వ్రేలనేల నిలువబడి యూర్ధ్వ బాహుండయి మిన్నుజూచుచు అంతరింద్రియముల నణచి బాహ్యేంద్రియంబులంబట్టి ప్రాణేంద్రియంబులనిల్పి కర్మేంద్రియముల చలనము గానీక విషయేంద్రియంబుల జోలిబోక యేకచిత్తంబుతో నా బ్రహ్మనుగూర్చి తపస్సు జేయుచుండె యిక మనము చేయవలసిన పనియేమి.

నైశ్వా—ఈ సమయమున వాడి పట్టణమునకు వెళ్ళి రక్కసుల నుక్కడగించి పట్టణమంతా సూరగొని రావడమె.

గీ॥ యింతకంటెను చేయున ♦ దేమిలేదు
సంతసంబున జయమిక ♦ చింతలేల
మీదికార్యంబుజూడను ♦ మేలుగలదు
సాధుజనబాధ కుండిక ♦ సరగవినుము.

యము—అటులయిన,

ఉ॥ రెక్కలు లేనిపక్షివలె ♦ రిక్తశరీరుని మాడ్కి వాడు యే
దిక్కును లేకచిక్క మన ♦ దేవతలంత సుఖింతు రెప్పుడే
చిక్కులు రాకపోవు నిక ♦ శీఘ్రముపావకు నుత్తరమ్ము మా
చక్కగ నుండె లెండుపురి ♦ చాటుడివార్త ప్రయాణమిప్పుడే

ఇంద్రు—

కీర్తన.

దండధరానీవు జెప్పు ధర్మం। తగియున్నది మనకింకను తరలించుము సైన్యము ॥ దండ ॥

య—ఇంద్రా నీకు సందేహమేల । యింద్రేశుడయిన మెచ్చు
యికను జెప్ప నేల ॥ ఇంద్రా ॥

ఇం—బలముగనుట కట్టునిన్ను । బల్కితి వారిబలము గనుటకర్ణ
వైశ్వానరుబంపుము ॥ దండ ॥

య—లెమ్ము లెమ్ము ప్రయాణమ్ముగమ్ము । సమ్మతించి ధనం
జయుడు సాగిపోవుచుండెనడుగో ॥ ఇంద్రా ॥

ఇం—మాతలీ ఐరావతంబు నాయత్త పరుపుము. ఆచార్యా! ఆజ్ఞ
దయచేయుము.

బృహ—చిరంజీవి చిరంజీవి శుభం శుభం.

యింద్రు— కీర్తన.

జయజయజయలక్ష్మి । జయజయజయలక్ష్మి
జయముమాకివ్వవమ్మా । జయజయమునీకు ॥ జయ ॥

1. నీప్రాణనాథుని । నిజముగనమ్మితిమి
మాప్రాణములు నిల్పవే । మముగన్నతల్లి ॥ జయ ॥

2. యీబిడ్డలందరు । నీ బిడ్డలనుకొని
రాబడ్డరణమందు । రక్షింపుమమ్మ ॥ జయ ॥

3. నారాయణరెడ్డి । నమ్మినినుతల్లివని
పారాయణజేయ । పలుకవేముందు ॥ జయ ॥

(యెవరి వాహనములతో వారు అందరు (నిష్క్రమింతురు)

---

2 రంగము - నవలాపురి కోటసింహద్వారము.

(వైశ్వానరుడు ప్రవేశించ బో నచటనుండు)

చండప్రచండులు—ఎవరునీవు.

వైశ్వా—నేను పావకుడను.
చండ—యేమిపని.
వైశ్వా.—ఇంద్రాదిదేవతలు, దండధరుడు, వాయుదేవుడు, నేను యింకా మొదలయిన దిక్పతులు మీాపట్టణముపై యుద్ధమునకు వచ్చితిమి.
చం-ప్ర—(లోనికేగి) అయ్యా! త్రిమస్తకా, త్రిలోచనా, శకుని, శంబరా సురులార! యింద్రుడు, దండధరుడు, అగ్నిదేవుడు వాయుదేవుడు యింకా మొదలయినదేవతలు మన పట్టణముపై దండెత్తియున్నారు.
ప్రచం—చతురంగ బలసమేతుడయి ఇంద్రుడు మన కోటముట్టడించి సింహద్వార కవాటముల భేదించి లోపలికి రా ప్రయత్నించు చున్నారు ఆలస్యము లేదు.
త్రిమ.—త్రిలోచనా! శకుని శంబరా సురులార! మనము చేయవలసిన కార్యమేమి.
త్రిలో—రాజులేని కయ్యమా, యింక మనకార్య మేమని యడుగవలసిన పనియేమి వెళ్ళవలసినదే.
త్రిమ—

కీర్తన.

సరేసరే యిదిసమయము గాదనుకొండి
మరేమరే మాటలాడక। ఒరేఒరే పోదములెండి॥ సరే॥

1. ఖద్యోతుండు ఖద్యోతంబా। గరుత్మంతుడు యూరబిచ్చుకవు గజేంద్రంబుయిక దోమయవునుమరి । కాని సమయమున అడవిసింహము యూరసింహమవు॥ సరే॥
2. నారాయణదేవుని నమ్మినవారే వారే। కారణమేమొ తెలి

యదిప్పుడు రారే రారే। ప్రాణములుండిన వరలును
సుఖములు। సరే॥ (అని అందరు నిష్క్రమింతురు)

(ఇంద్రుడు, యముడు ప్రవేశము వీరిలో వైశ్వానరుడు కలసుకొనును)

ఇంద్రు—దండధరాదిముఖ్యులారా! దైత్యమత్తేభ కేసరులార.

కీర్తన.

పూరగొనుడిపట్టణమంత। యేరియెదురుమనకు లేదు। పూర॥
నారికేళ ఫలములను నారింజ పండులను। ఆరగించి యున్న
వరకు॥ పూర॥

1. రాజనగరులన్నిముందు। రయమున బడగొట్టి అందు
తేజములరు రత్నముల। తెక్కరమయిన వస్తువుల॥ పూర॥

2. మంటపముల బగులగొట్టి। మింటికానుచున్న కోట
గుంటిబెట్టిత్రొవ్విత్రొవ్వి। గెంటిపడదోయుడి॥ పూర॥

3. గోపురములు అట్టళ్లు చావిళ్లు ముంగిళ్ళు
మాపుజేసి రండిరండి। మైదానమవునట్లు॥ పూర॥

4. చలువతీగ మల్లెతీగ। సన్నజాజులు పూలగుత్తులు
కలువరేకులు ద్రాక్షతీగలు। ఖండించిఖండించి॥ పూర॥

5. గంగుల నారాయణాఖ్యుని। గాంచిబ్రోవుచున్న హరిని
భంగమేమిలేకహృదయ। రంగమందునిల్పినిల్పి॥ పూర॥

వైశ్వా—యింద్రా! వచ్చినపని దీరినది.

యింద్రు—లీలావతిని చెరబట్టితిరా.

యము—యిదిగో. (అని లీలావతిని జూపును.)

యింద్రు—యీదినము మనము బయలుదేరిన వేళ మంచిది. భగ
వంతుని నమ్మినవారికి తరుగా? లేదు లేదు.

వైశ్వానరా! ప్రయాణభేరి వేయుంచుము.

వైశ్వా—చిత్తము. (అని భేరి వేయించును)

(అందరు అచటనుండి వెడలుదురు)

లీలా—హా! యీశ్వరా, జగదీశ్వరా యేమి నీమాయ మాయగా కేమి మహా వేదాంత తత్వవేత్తలే నీమాయ గనలేక ఉత్తదనిరి జగత్తును ఉత్తదనకేమి యెంతవిచారించిన అంతుబట్టనా యీ సృష్టిచిత్రము. చిత్రముగా కేమి తెలియనప్పుడుదుఃఖసుఖంబులు సమమె. నిజమునిజమునిజముగా కేమి నావిషయమే నాకనుభవము.

గీ॥ భోగభాగ్యము ల్వచ్చుట ♦ పోవుటరి
కెరుక నారికేళజలము ♦ సరణివచ్చు
బాయునే న్గుదిన్న వెలగ ♦ పండులోని
గుజ్జుమాడ్కి శాశ్వతమేది ♦ ముజ్జగముల.

యింద్రా! నను చెరబట్టిన లాభమేమి పాపమా పాపాత్ములు నీలోకమ్మునకే అన్నలుగారు. నీవు పాపంబును గట్టుకొనెదవా కట్టుకొనవు అన్నయ్యా దేవేంద్రా మనవి.

కీర్తన.

దీనురాల నే దీనురాలా

1. దీనులబ్రోవుకీర్తి దేవతచక్రవర్తి। దేవతచక్రవర్తి దినకరతేజ స్ఫూర్తి ॥ దీను ॥

2. గర్భిణిస్త్రీనినేను కంప మెత్తెనుమేను। కంప మెత్తెనుమేను చంపుము నీచేతితోను ॥ దీను ॥

3. నారాయణస్వామి న్యాయమనునుసుమి । న్యాయమనును సుమి ననువిడచి పెట్టుమి ॥ దీనురాల ॥

సీ॥ పరకాంతలనుబట్టి ♦ బాధించువారికి
యేలోకమోనీవు ♦ యెరుగుదయ్యా
శరణన్న విడువక ♦ చంపినపాపాత్ము
లెచటనుందురో నీవు ♦ యెరుగుదయ్యా
భూ్రిణహత్యలొనర్చు ♦ బూన్చుకిరాతకుల్
యెట్లాటమునునీవు ♦ యెరుగుదయ్యా
దిక్కు లేకనుయున్న ♦ దీనుల చరబట్టు
టేమిన్యాయమొ నీవు ♦ యెరుగుదయ్యా
గీ॥ ఎరిగియిట్టుల జేయుట ♦ లేటికయ్యా
ఆడుదానను నిన్నేమి ♦ నాడితయ్యా
పతియె దైవంబుగాగొల్చి ♦ బ్రతుకుదయ్యా
నేరమేమియెరుగ నమ ♦ స్కారమయ్యా.

శ్రీమద్రమారమణగోవిందో హరిః.

నార—

కీర్తన.

హరిగోవిందం భజరేభజరే। గిరిగోవిందం భజరే భజరే
కరిరాడ్వరదం భజరేభజరే। గిరిరాడ్వరదంభజరేభజరే॥హ॥

1. బంగారుచేలం భజరేభజరే। పక్షివాహనం భజరేభజరే
మంగళదాయకంభజరేభజరే।మానస నేత్రంభజరేభజరే।హ

2. పురహరవినుతం భజరేభజరే। పుండరికాక్షం భజరేభజరే
వరనారాయణంభజరేభజరే। వారిజనాభంభజరేభజరే॥హ

(ప్రవేశించి)

గీ॥ సత్య లోకము నుండి నే ♦ సమము గాను
వచ్చుచుంటిని కైలాస ♦ వరము కడకు

విష్ణుపురముకు వేంచేసి ♦ వెళ్ల వలెను
మరల బ్రహ్మ పత్తన మింక ♦ మాట లోను

వైద్య, యమ, ఇంద్రు, —నారద మహామునీంద్రా! నమస్కారము.

నార—శుభం, శుభం.

లీలా—స్వామీ! సాష్టాంగ నమస్కారము "సాధూనాం పుణ్య దర్శనం" దయయుంచుము.

నార—అమ్మా! చిరంజీవి, చిరంజీవి.

ఇంద్రా! లీలావతిని చెరబట్టిన కారణ మేమి?

ఇంద్రు—నారదా! వినుము దురహంకారి లోకద్రోహి హరిశత్రువు మహాబలుడు అయిన హిరణ్యకశిపుని, వీర్యమే నీ యమ కుక్షి నత్యంత సమృద్ధినొందెడిది అటువంటి కఠినుని వీర్యముచే నవు శిశువు మహాపాపాత్ముండౌను గాన ప్రసూతి యయ్యే వరకు నీమె నిక్కడేయుంచి ఆ పుట్టిన శిశువును నా వజ్రాయుధముచే ఖండించి లీలావతిని విడిపించెద.

నార—ఓహో? యింద్రా! యీమెగర్భంబున మగశిశువే యుద్భవించునుగాని, నీవు చెప్పినట్టుల పాపాత్ముండుగాడు.

ఆ॥ గరుడగమనుకథలు ♦ కాంక్షతో వినుచుండు
ఆర్యసేవజేయు ♦ నాత్మభక్తి
తల్లులనుచు నితర ♦ తరుణులగనుచుండు
పరమభాగవతుడు ♦ సురవిహితుడు.

యింద్రు—సత్యమా నారద.

నార—సత్యము సత్యము సత్యము.

యింద్రు—త్రిలోకసంచారివి, దేవమునివి,నీకు తెలియనిసంగతులు మాకు దెలియునా!

గీ॥ పాపపుణ్యంబులును గాంచి ♦ పలుకు వాడ
పరమ చారిత్రమునుగల్గి ♦ ప్రబలు వాడ
నీవుయిష్టమెద్దియొ చూచు ♦ మిరవు మీర
మేముజెప్పము తిరుగిక ♦ మేలుగాను.

నార—నా యిష్టము. ఆమె నామె భర్తకు నొప్పగించుటయే.

యింద్రు—మంచిది మంచిది.

లీలా—అయ్యలారా! అందరువినుడు.

గీ॥ సాధువుల దర్శనమున శ్రీ ♦ సౌఖ్యపదవి
యనుచు తెలిసినవారను ♦ కొనుచు నుండ
వింటి యిపుడుగంటి భువిని ♦ విన్నవారు
సుజన సాంగత్యమొనరిచి ♦ సుఖమువడుడు.

(అందరు నిష్క్రమింతురు)

3వ రంగము - వనభూమి.

(లీలావతి, నారదుడు నడచుచు ప్రవేశింతురు)

లీలా—తాతగారు తత్వమొకటి చదువుడు. వింటే తత్వమే వినవలె కంటె పరమాత్మనే గనవలె తింటే తీపేతినవలెనని మీ బోటి వారు జెప్పవింటెని.

నార—అమ్మా! నాకు దగ్గరగావస్తుండుము. ఆలాగె చదివెదను.

తత్వము.

ప్రాణెపుడు బోతుందో తెలియదు। నీవుపాడాశలో బడి
పరమాత్మగనలేవు మనసా॥ ప్రాణె॥

1. సంసారం మహా సారమంచు। సాగిసాగిపోతావుమంచు
నీదుంపదెంచు నాదుంపదెంచు మనసా॥ ప్రాణె॥

2. అతుకులబొంతాని యెరుగక। ఆనందమిదియాని వదలక
బ్రహ్మానందమిదియని వదలక। చేవదలక ఛీవదలకమనసా॥ ప్రా॥

లీలా—తాతగారు నాకేమి అర్థముగాలేదు. నీ దుంపదెంచు నా దుంపదెంచు అంటే యేమొ చేవదలక ఛీవదలక అంటేయేమొ స్వామీ సెలవిమ్మా.

నార—అమ్మా ఆలాగయితే ఆకనుపడు వటవృక్షుచ్ఛాయకు వెళ్ళి కూర్చొని విశ్రాంతిగాచెప్పెదను. అచటనే మనఆశ్రమముకూడా కలదు. (అని ముందరకు పోవుదురు కూర్చుందురు)

అమ్మా! సావధానచిత్తంబుతో వినుము. నీదుంపదెంచు నా దుంపదెంచు అనగా నీ,నా భేదముల త్రుంచుమని అర్థము. చే, వదలక ఛీ వదలక అనిన బ్రతికినన్నాళ్లు దానధర్మములు చేయక ఛీ చెడ్డనువదలక మనసా ప్రాణెపుడో బోతుంది జాగ్రతాయని యర్థము.

చరణం- నారాయణ రెడ్డినినేలు । నారాయణ యాయనవె
మేలుకో మేలుకో మేలు మనసా। ప్రాణె।

అమ్మా, ఓం నమో నారాయణాయ అని అనుము జన్మకుమేలు గల్గును.

లీలా.—ఓం నమోనారాయణాయ ఓం నారాయణాయ ఓంనమో నారాయణాయ.

నార—అమ్మా, యిది పరమరహస్యము నిత్యమునుమరువకుము.

శ్లో॥ గురుపాదోదకం పీత్వా। గురోరు చ్ఛిష్ట భోజనం
గురుమూర్తే సదాధ్యానం। గురుమంత్రం సదాజపేత్.

అని పెద్దలు జెప్పుచున్నారు. (లీలావతి నిద్రించును.)

(గర్భములోనున్న శిశువు అనగా)

ప్రహ్లా—చిత్తము, చిత్తము.

నార—అమ్మా! నీభర్త బ్రహ్మచే వరముల బడసి వచ్చుసమయ మాయె యిక యింటికి వెళ్లుదము రమ్మా. (తెరబడును.)

4వ రంగము - నవలాపురి కోట సింహద్వారము.

(చండప్రచండులు లేచి నిలువబడి యున్నారు.)

నార—అమ్మా, నేనిక పోయివచ్చెదను అదిగో మీ కోటసింహ ద్వారము. వారే చండప్రచండులు.

లీలా—చిత్తము.

నార— కీర్తన.

ఆనంద మానందము! బ్రహ్మానంద మానందమానందము

శ్రీ భగవన్నామ మానంద మానందము

1. కైలాసవాసుని కన్నులజూచుట। ఆనంద మానందము॥ బ్ర॥

2. వారిజనేత్రుని కోరిభజించిన। యానందమానందము॥ బ్ర॥

3. సజ్జనసాంగత్యం ముజ్జగములబలె। ఆనందమానందము॥ బ్ర॥

4. నారాయణవరమునినమ్మినభక్తుల।యానందమానందము॥ బ్ర॥

చ-ప్ర—హా, హా! యీ దినము సుదినము రాజుగారు బ్రహ్మచే వరముల బడసి యిప్పుడే దయచేసితిరి. మీరు యిప్పుడే దయచేసితిరి. అమ్మా! లోనికేగుదమురమ్మా.

(ముప్వురు నిష్క్రమింతురు)



శ్రీరస్తు.

శ్రీ

# ప్ర హ్లా ద.

తీయాంకము.

(కొలువుకూటము.)

హిర — త్రిమస్తకా, త్రిలోచనా!

గీ॥ లోకముల నన్నిటం జూడ ♦ నాకు నెవరు
లేరు నెదురు జయించితి ♦ సూరి జనులు
పాకశాసనాది సురలు ♦ వారి వారి
పనులు చక్కఁజేతురు రాజ్య ♦ మునకు శుభమె.

ఇంద్రుడు, వలయునపుడు వర్షించుచున్నాడా! అగ్ని, చెప్పినట్లు వినుచున్నాడా! పవనుడు, మన పట్టణమంత కసవును బాగుగా నూడ్చుచున్నాడా, అప్సరసాదులు సమయమునకు వచ్చి నాట్యము సలుపుచున్నారా! గరుడగంధర్వ కిన్నెర కింపురుషాదులు సంగీత సాహిత్య వాద్యములందు రసములను జూపుచున్నారా! స్వారాజ్యలక్ష్మి నకుంఠితయై యున్నదా.

త్రిమ — మహారాజశ్రీ హిరణ్యకశిప మహారాజా! మీరిపుడు సెలవిచ్చినవాటిలో లోటేమియు లేదు. కాని,నొక విషయము మాత్రము సంశయము.

హిర — త్రిమస్తకా! నాముందరనా, కానీలు,గీనీలు. యింటియందు వెలుపలను, క్రింద, పయిన, ప్రొద్దుగ్రుంకునపుడు, ప్రొద్దుబొడు

చునపుడు, రాత్రింబవళ్ళు సకల శస్త్రాస్త్రముల భూరి గాథహా, రక్షో మృగవ్యాళా దిత్యసురులవలన త్రిమూర్తులచే నిక దేనిచే, నయిన మృత్యువు లేని జీవనము బ్రహ్మచే వడసితిని. ఆ సంశయ మెద్దియో చెప్పుము.

త్రిమ—మన అబ్బాయి ప్రహ్లాదు డహర్నిశము అన్న పానాదుల గూడవదలి మనకు పరమశత్రువయిన శ్రీహరి నామస్మరణము మరువక చేయుచుండె నట తల్లి యెంత బుజ్జగించి చెప్పినను మానడట.

హిర—(ఆశ్చర్యముతో)

గీ॥ హరినిదలచెన నిజమా సు ♦ రారిసుతుడు
పిలువుడాచార్యులను నేల ♦ ప్రియముతోడ
చదువుచదువని వాడిల ♦ సరసుడగునె
ముదముమీరగ చదివింప ♦ ముద్దు పట్టి
నిపుడెరప్పించు డిటకును ♦ నిరవు మీర
పగతుడాహరి మనకని ♦ బయలుపరతు

త్రిమ—చిత్తము. చిత్తము ఆలాగే.

హిర—మనకు గురువయిన శుక్రాచార్యుని గూడ తొందరగ రప్పింపుడు.

త్రిమ—అయ్యా! ఆలాగే. (అని నిష్క్రమించును)

(ప్రహ్లాదుడు ప్రవేశించి తండ్రియొద్ద నిలువబడి యుండును.)

చండు—ఒరే, సోదరా! మనరాజుగారి కుమారుడయిన ప్రహ్లాదుని పాఠశాలకీ వేళ బంపునట కావలసినంత పప్పన్నము.

మార్క—ధోవతుల చాపో.

చంపు—అదియు.

మార్కు—ఉత్తరియ్యాలో.

చంపు—అవి లేకుండనా?

మార్కు—అట్లాగయితే పద పోవుదము బాగా ఉంచు ఉంచు యున్నది.

చంపు—ఒరే నేతిగిన్నె మరచితివా?

మార్కు—అదిమరచితే యింకా యేమున్నది కొంప మునిగినట్లే పెరుగులోటాగూడా మరువలేదు పదపద.

హిర—త్రిమస్తకా! ఆచార్యులు వచ్చితిరా!

త్రిమ—ఆచార్యకుమారులు చండప్రచండతేజులయిన చండామార్కులు వచ్చితిరి.

హిర—కుమతి బృందారణ్యకుఠారులార గురుకుమారులార నమస్కారము.

చ-మా-ఆయురారోగ్యైశ్వర్య పుత్రమిత్ర కళత్రాది వృద్ధిరస్తు శుభమస్తు.

హిర—చండామార్కులార వినుడు.

ఉ॥ బాలురతోడ నాడుచును ♦ పల్కడు మొత్తయు బిల్వనన్నమున్
గోలడు వేళ్లకున్ హరిని ♦ గూరిచి స్తోత్రము జేయుమీరు నే
కాలము మాకునార్యులును ♦ కార్యము విద్దెయు నంత జెప్పి యీ
బాలుని నీతికోవిదుగ ♦ పౌరుషశాలిగ జేసి బ్రోవరే.

చంపు—రాజాధిరాజా! మనవి,

గీ॥ బూటకము లేల యితనికి ♦ మాటలోన
విద్దెలున్న వరకు జెప్పి। వేరుబోక

నీతికోవిదుగాజేసి ♦ భూతలమున

గాంచెదమువీరివలన ఖ్యాతి ♦ కనకరాజ॥

మహాప్రభో సెలవొసంగుము.

హిర—చిత్తము. అలాగే?

చ-మా—　　　　　కీర్తన

ప్రహ్లాద రావయ్యా పాఠశాలకేగ । ఆహ్లాదముగ విడక
ఆటలకునుబోక॥ ప్రహ్లా।

1. రాక్షసవంశమునకు రాజువై పుట్టితివి । రాజాధిరాజ
మహారాజాధిరాజా॥ ప్రహ్లా॥

2. మీతండ్రి సురాసురులకు । మేటి రాజయినాడు
మాతండ్రికృపవలన । మంచిదిదినమున॥ ప్రహ్లా॥

3. నారాయణరెడ్డి। నమ్మినహరివలన
చేరవుసంపదలు। జేజేలకయిన॥ ప్రహ్లా॥

చండ—నెయ్యిగిన్నె దొంగుకుచున్నదేమొ జాగ్రత.

మార్క—అన్నయ్యా, అది తొంగకనిస్తాను? కాకుంటె యీ పొట్ట
లోనయిన బోస్తానుగాని.

చండ—అట్లా పుచ్చుకోబోయి అంతా పుచ్చుకుంఛావయేమి?
చచ్చేవు నెధివి.

మార్క—మనపెద్దచెరువులో నీళ్లు చాలా ఉంటూఉంటూఉన్నవి
చావను.

చండ—ప్రహ్లాదా! పాఠశాలకు తొందరగా నడువుము లగ్నము
మించిపోతుంది.　　　　　(అందరు నిష్క్రమింతురు.)

2వ రంగము — పాఠశాల.

(చండామార్కులు ప్రహ్లాదుడు ప్రవేశము)

(సువర్ణముఖుడు నేల కా గుణింతము బెట్టి చదువుచుండును తతిమ్మా పిల్లలదే ప్రకారము పెట్టి చదువుచుందురు)

చండ—ఒరే! సువర్ణముఖా! రజితాసుర, దంతవక్త్ర, రక్తనేత్ర, తామ్రకేశ, ప్రహ్లాదునకు అక్షరభ్యాసము సేయ బోవుచున్నారము మీరు యావన్మంది యేవిధమైన చప్పుడు లేకుండా కూర్చొన వలయును.

రజి—మరే పంతులుగారు నిన్ననే మరే దంతవక్త్రుడే నాబలపము షూచి యిస్తానని తీసుకొని యివ్వలేదండి.

చండు—యేమిరా దంతవక్త్ర నిజమేనా?

దంత—కాదండి ఆయనకి నాబలపము యితేను నేనుతీసుకున్నానండి.

రక్త—పంతులుగారో. మరే తామ్రకేశుడే నాచోటులోనే అల్లా వేళ గూర్చున్నాడండి.

మార్క—యేవేళ్లరా.

రక్త—మావాండ్లు తగాదుకున్న నాడండి.

మార్క—ఛీ, వెధవి కూర్చోపో.

రక్త—తామ్రకేశుని యెప్పుడు నాచోట్లో యిక కూర్చొ వద్దని మీరన్న జెప్పండి.

చండు—సరే పోయి కూర్చుండుము. ప్రహ్లాదా పద్మాసన మేసి కూర్చొనుము.

ప్రహ్లా—(అలాగే కూర్చుండును)

చండు—యిదిగో పలక బాగా బట్టుకొనుము. (అని ప్రహ్లాదునకు

పలక నిచ్చును) (శ్రీ) ఒ న మః శి వా యః. సి ధం న మః.

ప్రహ్లా—సరస్వతి. ఒనారాయణాయః సిధంనమః.

చండు—మరలా నాలాగే.

ప్రహ్లా—(మరలా నాలాగే.)

చండు—(తనలో) మూడక్షరములు మాత్రము తేడాగా బలుకు చున్నాడు. రేపటికి తగినవి కూడ పలుకునటుల జేసెదను.(ప్రకాశముగా) ఒకసారి ఓనమాలు దిద్దుము ప్రహ్లాద.

ప్రహ్లా—పంతులుగారు, ఓనమాలుచూడండి వ్రాసుకొనివచ్చినారు.

చండు—(తనలో) చిత్రముగానున్నది. ఒక్కసారి దిద్దుకొని ఓనమాలు తప్పులుబోకుండ వ్రాసినాడు. ఔను చిత్రమే మున్నది రాజకుమారుడు. (ప్రకాశముగా) ప్రహ్లాదా! తప్పులు లేవు పలక గట్టించుము అ ఆ లు దిద్దబెట్టెదను.

ప్రహ్లా—ఆలాగె. (అని కట్టించి పలకనిచ్చును.)

చండు—సువర్ణముఖా. తలిమ్మా వారంత పలకలుగట్టించి తీసుకొని రండు పద్యముల వ్రాయవలయును.

(పలకల నందరు తీసుకొనివచ్చి పంతులకు నిచ్చెదరు)

చండు—బడి రేపుశనివారము సెలవు అందరు యిండ్లకు వెళ్లుడి పలకలు జాగ్రత పద్యముల బాగుగా చదువుడి.

(బాలులందరు తెర తిరిగి మరలా వస్తురు)

చండు—రజితాసుర పద్యముల నొప్ప జెప్పుడు వరుసగ.

(రజితాసురుడు)

ఉ॥ రెక్కలురావుపిల్లలకు ♦ రేపటినుండియు మేతగాన మిం
బొక్కెడు గూటిలోసెగసి ♦ పోవగ నేరవు మున్నుతల్లి యీ

దిక్కుననుండివచ్చునని ♦ తిరిగిపుని చూచుచుండెడి నిక్కినిక్కి న
ల్దిక్కులజూచుచున్నవతి ♦ దీనత నెట్లు భరింతునక్కటా.

(తామ్రకేశుడు)

కం॥ పరులెవ్వరు దామెవ్వరు
పరికింపఁగ నేకమగుట ♦ భావింపరు త
త్పరమజ్ఞానము లేమిని
బరులును నేననుచునోచు ♦ ప్రాణులకెల్లన్.

(దంతవక్త్రుడు)

ఆ॥ ధనముపేదవడిన దైవవశముననుండు♦బోవుమూలనున్న బోవువేళ
నడవిరక్ష లేని యబలుండువర్ధిల్లు♦ రక్షితుండుమందిరమునజచ్చు.

(రక్తనేత్రుడు)

చ॥ వలనధికంబుగాగల్గి ♦ వైద్యులుశాస్త్రము లభ్యసించి మం
దుల నొడగూర్ప నేర్చి తను ♦ దోషములారయు బుద్ధిగల్గి యా
ర్తులకు చికిత్స జేసెదరు ♦ రోగమివాయమి లేదె వారు రో
గులగుట గానమెట్లు ♦ ప్రతికూలవిధిన్ నరు నేర్పుద్రోచునే.

(ప్రహ్లాదుడు)

కం॥ గూఢార్థము ఘను డెరుగును
మూఢాత్ముండేమియెరుగు ♦ మొనసిన వేళ్ళన్
గాఢాలింగన సౌఖ్యము
ప్రౌఢాంగన యెరుగుగాని ♦ బాలేమెరుగున్.

చండు—సువర్ణముఖా యింత ఆలస్యమేల జేసితివి.

సువ—ప్రొద్దుబొడువక ముందే లేచి

గీ॥ తత్వవేత్తలు మరికొంత ♦ దగిలిభువిని
బోధ జేయుచునుందురు ♦ బుద్ధివదలి

స్త్రీ ధనంబుల కైంకర్య ♦ సిద్ధికొఱకు
వారిగొలచిన సుఖమేమి ♦ వలదువలదు.

అని మీరు వ్రాసిపెట్టినపద్దెము చదువుకుంటున్నాడండి బలి పురమునుండి మాబావగారు నిన్నవచ్చి యీవేళ ముఖముకడు క్కుంటున్నాడండి కడుక్కుంటు, యీపద్దెమును నేను చదువ విన్నాడండి విని మరలా చదువమన్నాడండి చదివేవరకు బాగా వున్నది అటుయిటు రెండర్థములకు సరిపోయిన దన్నాడండి అనే వరకు యేమిటా రెండర్థములని విచారణతో మెల్లగావచ్చానండి

చండు—సరే చద్దిఅన్నానికి వెళ్లండి. (అందరు నిష్క్రమింతురు)

3వ రంగము - రాజనగరు.

హిర—త్రిమస్తకా, త్రిలోచనా! అబ్బాయి పాఠశాలకు బోబట్టి కొంతకాలమరిగెను. విద్యాభ్యాస మెంతవరకయినదో చూడ వలె గురుకుమారులకు తెలియజేయుడు.

త్రిమ—త్రిలో—చిత్తము, చిత్తము.

(చండామార్కులు ప్రహ్లాదుడు ప్రవేశింతురు)

హిర—ప్రహ్లాదా! నాన్న యిటురమ్ము నాతొడలపయి కూర్చుం డుము. (తొడలపై కూర్చో బెట్టుకొనును. చుంచుదువ్వి చెక్కిలి ముద్దుగొనుచు.)

ఆ॥ ఆర్యులేమి జెపిరి ♦ హరిని మరచితివ
చదువుశాస్త్రములను ♦ చక్కగాను
మరుగుపరచకయ్య ♦ పరమసంతోషము
తనయులపలుకు లిక ♦ జనకులకును.

ప్రహ్లా—తండ్రీ! అంతకన్నానా? వినుము. (అనిలేచి)

గీ। కలశరీరధారులిల్లపై ♦ కాంక్షవిడచి
వాదభేదంబులును మాని ♦ సాధుబుద్ధి
ఆదివిష్ణువు యీ జగంబంత ♦ యనుచు.
మున్ను గనుట యెమంచిది ♦ కన్నతండ్రి.

హిర—నాయనా, ప్రహ్లాదా! యెవరుచెప్పిరీబుద్ధినీకు గురువులా, యితరులా.

చండు—ప్రహ్లాదా! ఎంతజెప్పినా, నాబుద్ధిమానకపోతివేబుద్ధిలేదా.

ప్రహ్లా—బుద్ధిలేకేమి.

గీ॥ సూర్యకాంతికి తదితర ♦ శోభలెల్ల
మాయునట్టుల శ్రీహరినామ ♦ మహిమవలన
తదితర మహిమలెల్లను ♦ తగ్గుచుండు
భూరిగుణుబార మరతురే ♦ భోగిశయను.

చండు—రాజా సామదానముల జూచితిమి. ఇక మిగిలిన భేద దండోపాయంబుల నీతని దండించి పండితునిగా జేసుకొని కొద్ది కాలముననే తీసుకొనివచ్చెదము దయయుంచుము ప్రహ్లాదా! పద.

చండామార్కులు— కీర్తన.

ఇంతమదము బట్టినావుగా। సుంతభయము లేక కాసింతభయము లేక॥ యింత।

పిచ్చిపిచ్చి మాటలన్నియు । వచ్చివాగుచుంటివా హెచ్చుదేల బెత్తమిదిగో ॥యింత॥

త్రిమ—రాజా! భోజనసమయ మాయలెండు. లోనికేగుదము.అదియునుంగాక, కొందరుదేశాధీశులు కానుకలుదెచ్చి నీకోసరము కనిపెట్టుకొని యున్నారు. గడియారము పదివేసి అరవేయబోవుచున్నది.

త్రిలో—అనగో, ఆ అరగూడా వేసినది లెండు పోదము.

(అందరు నిష్క్రమింతురు)

### 4వ రంగము - పాఠశాల.

(చండుడు ప్రహ్లాదుడు తతిమ్మా బడిపిల్లలు ప్రవేశము.)

చండు—ప్రహ్లాదా! నే స్నానమునకు వెళ్లుచున్నాను. భోంచేసి వచ్చుపర్యంతము బాలురకు నెవరిపాఠముల వారిని చదువమని చెప్పి నీవు కూడ పాఠమును చదువుము.

(అని నిష్క్రమించును)

ప్రహ్లా—మీ చదువు పాఠముల నచ్చట గట్టిపెట్టి;

గీ। బాలులార రండుమనతో ♦ బడికివచ్చు
బాలులందరుయున్నారె ♦ పక్షపాత
కుడు వినదగు పల్కు గురుడు ♦ నుడువడెపుడు
నేను జెప్పెద వినుడు మీ ♦ నేర్పు లెసగ.

ప్రప్రథమమున సకల భువన నభోంతరాళంబులును నిక నేమి యులేక శూన్యమయి యుండె. నాశూన్యమున కావరించి కటికిచీకటి కాపురముగానుండె. నా కటికిచీకటి కావల పెంజీకటి పేరంట్రము జేయుచుండ నా పెంజీకటి పయిభాగమున పరంజ్యోతి పరమాత్మ పరబ్రహ్మ నిర్వికార నిరంజన నిగమగోచర సచ్చిదానంద స్వరూపుడయిన శ్రీఆదిమహావిష్ణువు క్షీరాపారావారంబు పైవటపత్రశాయియై పవళించి యుండి యొక్కసారి యతని కన్నులు రెండు తెరచిచూచెను. అపుడా తేజస్సు సూర్యచంద్రులుగా ప్రభవించెను. కన్నులు విప్పుటకు ముందు సంకల్పమాయెను నా సంకల్పమునకు పూర్వమాలోచన యుదయించె నా యాలోచన వలన నాకాశము

పుట్టెను. నాయాకాశమునకు వాయు వాయెను, నా వాయువులో
నుండి అగ్ని యవతరించె. నాయగ్నిచే ఉదకము లుద్భవించెను. ఆ
యుదకమునకు భూమిగలిగె నా భూతత్వమున నిఖిల ఓషధులు
పుట్టుకవచ్చె. నాఓషధుల మూలమున మాయ కల్పనాయె. నామా
య ఆ ఆదివిష్ణువును మోహించె వారిరువురకు బ్రహ్మ, యా బ్రహ్మ
కారణముగా నవబ్రహ్మలు. ఆ నవబ్రహ్మలకు మనువులు చరాచర
ములు యీ చరాచరములలో మన మొకరమింక మానుషజన్మ
మెత్తుటదుర్లభంబు. అందు పురుషుండయి పుట్టుట మహాదుర్ఘటంబు
ఇట్టి పురుషుండయి పుట్టినను, దినగండం నూరేండ్లాయుష్యం నిజ
ములేదు. నీటిమీదబుగ్గ గాలిలోదీపం దీనికే యార్గురుదొంగలు
ముప్వురు ముచుముగాండ్లు. ఏడ్గురు రేడ్పించువారు. ఎనిమిది మంది
వెతలబెట్టువారు. పదుగురు ప్రక్కలకీడ్చువారు. పదియార్గురుమారించు
వారు! ఐదుగు రాటల బట్టించువారు యిద్దరెప్పుడు వచ్చిపోయ్యే
వారు. ఒకడు బిక్కుబిక్కుమనువాడు. వాడొకచో నుండువాడు
కాడు. వాడేవీడు వీడే వాడు. వీడి నొకచో నుంచవలెనన్న పుత్ర
మిత్రకళత్ర గృహక్షేత్రా రామ ధనధాన్యములచే కాదు. తెలివిచే
కాదు. వర్ణముచేకాదు. యుక్తిచేకాదు. భక్తియే ముక్తికిసాధనము
ఆభక్తి శ్రీగోవింద నామోచ్చారణ మానక జేసిన యధికమవును
మిత్రులారా! ఒక్కసారి గోవిందనామము జేయుడి. 'శ్రీ మద్రామా
రమణగోవిందోహరిః' యింతకు మిగులు చదువులేదు. ఇది తొలి
చదువులకు తొలి చదువై యున్నది. ఈ చదువు నెరుంగకనే మన
వారు కష్టముల బడిరి.

సువ—ప్రహ్లాదా! మనము రాక్షసకులమున కయినవార మయితిమే
యీ జన్మములో నే మోక్షమున కర్హులమగుదుమా!

ప్రహ్లా—సోదరా! ఆసందేహ మేలకు నీకు! వినుము.

శ్లో॥ నశూద్రా భగవద్భక్తా। విప్రాభాగవత స్మృతాః
సర్వవర్ణేషుతేశూద్రా। యేహ్యభక్త్యాజనార్దనే.

అనగా శూద్రకులజుడయినను, భగవద్భక్తి వానికున్నట్లయిన వాడే బ్రాహ్మణుడు. వాడే భాగవతోత్తముడు. సర్వవర్ణములలో శూద్రుడెవడనగా, దైవభక్తి లేని వాడేయని యెరుంగవలయును.

సువ—ఆలాగయితే హరిభజన మొదలు బెట్టుము.

ప్రహ్లా—సోదరులారా! ఏకచిత్తముతోనుండి దిక్కులుజూడక కరతాళములతో శ్రీహరి భజనజేయుడు.

(ప్రహ్లాదుడు నడుమనుండి కీర్తన జెప్పుచుండును. బాలులందరు చుట్టు దిరుగుచు భజనజేయుదురు.)

ప్రహ్లా— కీర్తన.

1. జేజే భజగోవిందం। జేజే హరిగోవిందం
2. జేజే పన్నగశయనం। జేజే పాపవినాశం
3. జేజే పావనచరితం। జేజే పావనరూపం.

సువ—(ఆనందముతో)

గీ॥ కరుణగల్గిన చదివిది ♦ గాంచినాము
తల్లిదండ్రులకన్నను ♦ దలచగాను
యెక్క నైనట్టివాడవీ♦ వెంతవరకు
చెప్పియుండిరేగురువులీ ♦ మెప్పుబాట.

చండ—ఏమిటిరాగోల ప్రహ్లాదా! బాగుగాపాఠములుచదివినారా?

ప్రహ్లా—అయ్యా, చదివితిమి.

చండ—త్రివర్గపాఠముల తాత్పర్యము నొప్పజెప్పుడు.

ప్రహ్లా——(దగ్గరగా నిలుచబడి) ధర్మముదప్పక అర్థమును అనగా ద్రవ్యమును సంపాదించి కామః యిచ్ఛవచ్చునట్లు మానవుఁడు అఖిలసుఖముల ననుభవించుచుకీర్తిగౌరవముల జెందవలయును.

చండు——యీలాగు మీతల్లిదండ్రులవద్ద చెప్పగలవా! ప్రహ్లాదా! పోదము పద. బాలులారా! మీ రందరు యిండ్లకు వెళ్లుడి.

(అందరు నిష్క్రమింతురు.)

5వ రంగము - అంతిపురము.

(చండామార్కులు ప్రహ్లాదుఁడు (ప్రవేశింతురు)

లీలా——ప్రహ్లాదా! రాజవిద్యలన్ని నేర్చితివా?

ప్రహ్లా——తల్లీ! నేర్చితిని.

లీలా——నాయనా! ఒక్కమాట.

గీ। శ్రీహరీయన మీతండ్రి ♦ చింతజెందు
హరిహరీయన కోపంబు ♦ మరియుఁజూపు
గురువుజెప్పెఁ విద్యలు ♦ సరిగజెప్పు
చోరుడాహరి చూడగ ♦ చూడబడఁడు.

చండు——ప్రహ్లాదా! యిపుడు మీతల్లి చెప్పిన నీతివాక్యముల జ్ఞాపకము నుంచుకొనెదవా?

ప్రహ్లా——మరచిపోను.

చండు——శిష్యా! తల్లికి నమస్కారము జేసి దీవెనలవడసి నామె చే సెలవుఁగైకొనుము.

ప్రహ్లా——తల్లీ! పదివేల వందనములు.

లీలా——పుత్రకా! వర్ధిల్లు వర్ధిల్లుము. సకలగుణసంపన్నుండవయి వర్ధిల్లుము నాన్నా, యిదిగో యీసూర్యహారము వేసుకొనుము.

(అని మెడలో వేయును.)

(చండామార్కులు ప్రహ్లాదుడు సాగి యీవలకువత్తురు)

చండ—హిరణ్యకశిపమహారాజా! సురాసుర మేటితేజ నీకుమారునకు వర్గత్రయంబును, సామ,దాన, భేద, దండోపాయంబులాదిగాగల. సమస్తరాజనీతులు చక్కగా నుపదేశించితీసుకొనివచ్చితిమి. పరీక్షింపుము. ప్రహ్లాదా!తండ్రికినమస్కారము జేయుము.

ప్రహ్లా—(అచ్చటనే నిలువబడి నమస్కారము చేయును)

హిర—(అపేక్షతో)

క॥ రారాముద మొదవగయిటు। రారానను గన్నతండ్రి ♦ రారాశూరా
ధీరా చదివినచదువు కు। మారా నాకొప్ప జెప్పు మారక యిపుడున్

(బుజ్జగించి తనహస్తములతో కుమారుని తొడలపయినిడుకొని)

కుమారా! ఒక్కపద్యంబు చదివి అన్వయించి నాచెవులకు విందుగా జేసి మనస్సున కానంద ముప్పతిల్లునట్లు జేయుము.

ప్రహ్లా—చేయుకేమి చదువులలో సారమెల్ల నొక్కపద్యంబునవచ్చునట్లు చదివి అన్వయించెద చక్కగా వినుము.

గీ॥ సారమేమియు లేని యీ ♦ జగతియందు
కోరికలను విడచిసాధు ♦ కోటిగలసి
తొమ్మిదివిధంబులౌభక్తి ♦ తోయజాక్షు
జన్మ కడ తేరుటకునమ్మి ♦ సజ్జనుడయి
మెలగుటే మేలుగా జూతు ♦ మేటిదైత్య.

అనగా శ్రవణ,కీర్తన, స్మరణ, పాదసేవ, అర్చన, వందన,దాస్య, సఖ్య, ఆత్మనివేదనమను నీతొమ్మిది భక్తిమార్గముల శ్రీహరిని నమ్మి సాధుకోటిగలసి కొలచుచు సజ్జనుండయి చచ్చు వరకు యుండుటే మేలు. అటుల యుండువాడు మరల జన్మకురాక;

మోక్ష సామ్రాజ్యాభిషిక్తుఁడై ఆనందవార్ధిలో నోలలాడును.
యిదియే నా సమ్మతము యిదియే నా చదువు.

హిర—(కోపముతో తొడలపయినున్న కుమారుని క్రిందకు నెట్టి)
ఎవఁడురా! పంతులు.

చం—మా-(భయపడి యురకబోవురు మరలతిరిగ్వచ్చి త్తముచి త్తము.

హిర—నీతిశాస్త్ర చయపారగు జేసెదమంచు బాలుని గొనిపోయి
విరోధిశాస్త్రములు చెప్పితివి. నీవు నిజమయిన బ్రాహ్మణుండ
వా?మర్మము, మాయ, మట్టి,మశాసనముకలసిన కపటబ్రాహ్మ
ణుండవుగాక. ఒకటిచెప్పి నొకటిసేయుట మీ కభ్యాసమా!యిక
మీసంగతేమానో చూడుడు.

చం—రాజరాజా శరణు శరణు. మీకు పురోహితులమై యుండి
యు, గురువులమయియుండియు మీవలన జీవించుచు నీ కొమ
రుని కీ బోధ చెప్పగలమా! ఆగంధ గంధాయము మేమెరుగము
యిక ప్రహ్లాదుని చదివించుట మాచేతగాదు. మీయిష్టము(అని
(పరుగెత్తుచు) ఒరే సోదరా! నశ్యముకాయ పోయినదిరా.

మార్క—నా బీడిగూడా పోయినది అన్నయ్యా, పోతేపోయినది
లే యిక వెనుకకుతిరిగితే సస్తాం సస్తాం.

(అనుచు యిర్వురు నిష్క్రమింతురు)

హిర—ప్రహ్లాదా! యీబోధ యెవరుసెప్పితిరిరా! క్రోడంబై మీ
పినతండ్రిని చంపి కానరాక దొంగయయి డాగియున్న హరిని
కొనియాడుట న్యాయమా.

కీర్తన.

హరిహరియను టేమిన్యాయము। హాకుమార ప్రహ్లాదా॥ హరి॥

దురహంకారుడును నయి। తుళ్ళించువర దానవుల
కరుణలేనివాడు వాడు। కనుగొన్న యిపుడు। హరి॥

ప్రహ్లా—న్యాయముగా కేమీ జనక। నా హరినిదలచుట॥ న్యా॥
మాయలేకనటియించు। మహాత్ముల రక్షించు
మాయచే నటియించువారి। మడియించుమీరి॥ న్యాయ॥

హిర—దైవమొకడ శిక్షజేయును। తనుతానుగాగ॥ దైవ॥
కావుకావుమనుచు వేడి। కానకచచ్చుటే కాని
నీవులేవు నేనులేను। నిజమునెద వినువిను॥ దైవ॥

ప్రహ్లా—ప్రభువులేక జగములుండునా। పారజూడుదూరమేమొ॥ ప్ర
నభముమాడ్కి యేమిలేదని। నమ్మకముగ బల్కుచుంటివి
శుభమే లేదటులయిన। జూడుము నీమదిలోన। ప్రభు॥

అదియునుంగాక,

సీ॥ హరినామభజనమ్ము ♦ నాచరింపక యొప్పు
సంసారమనునది ♦ జన్మ జన్మ
పుండరీకాక్షుని ♦ బుద్ధితో గొల్వక
సంసారమనునది ♦ జన్మ జన్మ
శ్రీరమాధిపుపాద ♦ చింతనము విడచి
సంసారమనునది ♦ జన్మ జన్మ
వైకుంఠవాసుని ♦ వరుసగా బిలువక
సంసారమనునది ♦ జన్మ జన్మ

ఆ॥ పరమపురుషుకీర్తి ♦ పాఠంబు జదువక
చాలు చదువనునది ♦ జన్మ జన్మ
కోటిసూర్యతేజు ♦ గోరకయితరంబు
మంచునమ్ము ♦ జన్మ జన్మ.

హిర—యేమి? ప్రహ్లాదా! యీ న్యాయము హరి
ఫలమేమి;

గీ॥ దేవబృందము గెలచియు ♦ తేజమెసగ
యష్టదిక్పాలుర జయించి ♦ యహానసంగ
అసుర స్వారాజ్య మునకునా ♦ సరణిసేవు
ప్రభుడవయి కీర్తిదేవయ్య ♦ భ్రాంతివిడచి.

ప్రహ్లా— కీర్తన

పరమపురుషుని ప్రార్థన జేసిన। ఫలము కొసరివచ్చునది
లేను లేను లేనుయిరవుగభూమిలో। మరువక జూచిన లేను లేను లేను
పరమపురుషుని ప్రార్థనజేసిన। ఫలముతొసరినచ్చునదిక॥ లేను॥
పరమానందంబ్రహ్మానందం।బట్టబయలుగా వైకుంఠంబుపమిపమి

కం॥ జననమరణములు గలిగిన [ఏమి ॥ప॥
జనులకు దురితములు గలుగు ♦ జననమరణముల్
జనుహరి దలచిన సతతము
జనులకు దురితములు దొలగు ♦ సరగునజనకా॥

హిర-కం॥ హరిగిరియని తలచెదవిక
హరిననుగని భయపడియెటు ♦ లరిగెనొయిపుడుల్
హరి గిరి గనుననుగాంచిన
మరిమరిసుఖములుచు గలుగు ♦ మరివినుతనయా॥

ప్రహ్లాదా! నామాట పొరపాటేమొ మీతల్లియగు లీలా
వతి వలన కనుగొనుము. శ్రీమస్తకా లీలావతిని బిలిపింపుము.

శ్రీమ—చిత్తము ఆలాగే.

(లీలావతి ప్రవేశించి) కీర్తన.

తనయా మీతండ్రిమాట। తప్పులేదు తప్పకవిను ॥ తన ॥

సురాసురలకు మేటిరాజై । సూరిజనులకు నాటపట్టై
ధరావలయము నేలుచుండెను । తగదుతగదికతగదుతగదిక॥ త॥

ప్రహ్లా—వినను నే తండ్రి మాట । వేద వేద్యుని మరువతల్లి ॥ విన॥
పదునాల్గుభువనంబులను కుక్షిలో । పదిలపరచిన ప్రభువునిపుడు
హృదయకమలమునందునిల్పితి। అనుగొజగంబు త్తను త్తది ॥విన॥

హిర—తనయా: మీతల్లిమాట । తప్పులేదు తప్పకవిను। తన॥
కల్లగాదిది లోకాలోకము । లెల్లజూడగ పెద్దదేదన
తల్లియనుచును బలికిరాద్యులు । తగదుతగదికతగదుతగదిక॥ తన॥

ప్రహ్లా—వినను నేతల్లిమాట। వేదవేద్యుని మరువతండ్రి। విన ॥
తల్లిదండ్రి గురువుదైవము । తరణిశశి నక్షత్రకళలను
మెల్లమెల్లగ గనగవాడై। మెలగుచుండెను మెలగుచుండెను।వి॥

లీలా—తనయా మీతండ్రిమాట । తప్పులేదు తప్పకవిను॥ తన।
సరసుడౌ నారాయణాఖ్యుని । సతతమేలెడు స్వామియైనను
దరికిజేర్చడు భయముజెందెను । తగదుతగదిక తగదుతగదిక॥ త॥

గదా, ఖడ్గ, కుంతల, తోమర, పరశు, పట్టిస, శూలాది కౌశలంబును శస్త్రాస్త్ర ప్రయోగ ప్రావీణ్యంబును, ధనుర్విద్యాది శాస్త్రనైపుణ్యాంబును: చతుర్విధోపాయంబులగు సామదాన భేద దండోప లౌకికంబును, వర్గత్రయంబను ధర్మార్థ కామ పరంబుల యభిప్రాయంబును, షట్ఛాస్త్రంబులనంబరగు తర్క వ్యాకరణ ధర్మ మీమాంసవైద్య జ్యోతిషముల తాత్పర్యమున్ను చూసి కను పరచి చదివి తెలియజేసి అన్వయించిచెప్పి నాన్నగారిమనసు సంతోష పెట్టవలసినది. శ్రీహరీ శ్రీహరీ వైకుంఠవాసా యని పగవాని మాటిమాటికి దలచుట న్యాయమా! అది అన్యాయమా! మీతండ్రి

అష్టదిక్పాలుర పట్టణముల నాక్రమించి సత్యలోకంబును లోబరచుకొని, స్వర్గ, మర్త్య, పాతాళ లోకంబులకు ప్రభువవయి వైకుంఠవాసుని వెతుకగా నాతడు భయపడి వైకుంఠమునువిడిచి యెటులబోయెనో పోయెను. అంతులేదు. అయిపులేదు. ఆనవాలు లేదు. ఆ అంతు, అయిపు, ఆనవాలు లేనివాని నెంతెంతగా ప్రార్థించినను లాభములేదు. మీ నాన్నగారిచేతిలోనే నా వైకుంఠము గూడా పడియుండెను. ఓం నమోనారాయణాయ యను బదులు ఓం హిరణ్యకశిపాయనమః యనుము. రాజాధి రాజువై సకల సుఖములు ననుభవించెదవు. అదియునుంగాక,

తరలము॥ పరమహానులు నాన్నగారని ♦ పలుకుచుండిరి దేవుడ
స్మరపులేకను మానసంబుల ♦ మాటదప్పక నీపునా
హరినదల్చక హాయిగామను ♦ మాడలేదిక యెచ్చటన్
తిరిగిచెప్పుచునుంటి ప్రేమచె ♦ దివ్యభక్తి సుపుత్రకా

ప్రహ్లా— తరలము,

మనసులోపల నాటియుండెను ♦ మంచిగా హరినామముం
తనివిదీరను తల్లియొట్టుల ♦ తల్చుకొనును జూడగా
వినగనింకొక దైవమెచ్చట ♦ వేరె లేడని చెప్పగన్
వినియునిట్టుల బల్కుటేటికి ♦ వెఱ్ఱివాడన నాకదన్.

హిర.—(కోపముతో)

ఒరే ప్రహ్లాదా! యిక శ్రీహరియని నీనోట నుచ్చరించిన నా చేతనున్న ఖడ్గముచే నరికి రాక్షసులకు బారవేసెద.

ప్రహ్లా—శ్రీహరీ వైకుంఠవాసా!

లీలా— కీర్తన.

అయ్యా శ్రీహరినామ మయ్యాయికనైనవిడచి చయ్యానచదు

వు మంచిదయ్యా వెయ్యారు లేలతనయ వినుము నావాక్యసరణి
కయ్యాముపలనువలను॥ అ॥

ప్రహ్లా—అమ్మా! శ్రీహరినామమమ్మా। నే విడువజాలనమ్మా నీ
వాక్యసరణినమ్మా। యిమ్మహిలోపలగల్గు యితర చదువులు
నాకు సమ్మతి లేనులేను ॥ అమ్మా।

లీలా—తలిదండ్రుల మాటవినక। తొలగినాడని నినుబుధులు
కలకాలము నిందింతురు। కనుగొనుమిది పనిగొనుమిది ॥ అ ॥

ప్రహ్లా—తమనుతా మెరుగలేని కుమతి బృందమెంతయునిన
తమకను మదివణకను మరి। వినకనునది ॥ అమ్మా।

లీలా—ధనధాన్యము గూర్చిసుఖము। దనరుచుండవలెను నిలను
మనమాయిటు జేయుటలు। ఘనమాయివి బూటకములు। అ॥

ప్రహ్లా—ఆదివిష్ణు మనసునుంచ। ఆకలిదప్పులును లేవు
యేవిధంబేది సుఖంబేటి కీర్తియేది నిత్య॥ మమ్మా।

లీలా—పసివాడవు నినుజూచిన। కసిరాకనుమానదెటుల
పసమునుగన విరివిగజన। సరెసరె నీ తనువున ॥ అయ్యా॥

ప్రహ్లా— తెలియనివా రెవరొవారె। తెలిసినపసివారుగద
తెలియక పలుపలుకు లేల। అలక లేల అలత లేల ॥ అమ్మా।

లీలా—వలనుపడక ఆదిమునులు। వైకుంఠుని గన వలెనని
మలిగిరికాంతలిగిరి చింతిలుచును వనభూములంచు ॥ అయ్యా ॥

ప్రహ్లా—నారాయణభగవంతుడు। పారాయణ జేయజేయ
సారాముజిక్కుచుండె తారకమగుచునుండె। కోరెకలు నురుకు
చుండె॥ అమ్మా ॥

లీలా—ప్రహ్లాదా! నాన్నగారిమాట వినరాదా! కష్టములబడక.

ప్రహ్లా—శ్రీహరీ శ్రీహరీ! వైకుంఠవాస వరదాయక.

లీలా.—(తనలో) యిక నా కొమరుడు వినడు. చెప్పగలవరకు చెప్పి తిని. ప్రాణేశ్వరుని కయినా! చెప్పి చూచెదను.

1. ఒక్కమానవి వినుముదయతో॥ఓప్రాణనాథ నా ప్రాణనాథ॥ఒ॥
అక్కటకట కన్నసుతుని । ఆగ్రహమున జంపవచ్చున॥ఒక్క॥

2. మిన్నుమన్ను యున్నవరకు । నిన్నుకఠిను డందురు
నన్నుదూఱుచు నుందురు । యీజగా నందరు ॥ ఒక్క ॥

3. పాపమనక చంపుచుంటో । పాప మెరుగవ
పాప నెరుగవ యీ । కోపమాప నెరుగవా ॥ ఒక్క ॥

4. నారాయణ రక్షనేలు శ్రీమ । న్నారాయణుండు
మారాడకుండువీని । నేలుకోగలండు ॥ ఒక్క ॥

హిర—(కోపముతో) ప్రేయసీ? యేమి పేలెదవు. శ్రీహరి వీడిని తప్పక రక్షించునా? నీవు కుమారుని వైపునకు తిరిగితివా? ఇంక నొక ముహూర్తకాలములో నీతని పని యేమవునో కనుగొనె దవు. ఇచ్చటనుండి నీవు శీఘ్రముగా వెళ్ళిపొమ్ము. గజబలా, శతబాహుయీమరాత్ముని నాముందర లేకుండా, పట్టుకొని తీసు కవెళ్ళి మీ కరవాలములతో ఖండ ఖండములుగా ఖండించి రాక్షసులకు విందుజేయుడి పాపమనకుడి.

గ-శ—చిత్తము. ఆలాగె. మారిముందర ముక్క తెగులా?

(అని ప్రహ్లాదునిపట్టుకొందురు)

లీలా—(భటుల కడ్డపడి హిరణ్యకశిపుని వైపుజూచి)

## కీర్తన.

మీ దయయిటు లుండ మేము। యెటులనుందుము యేమి
సేతుము । యేమనందుము ఓనాధ॥ మీద ॥

తనయులు తప్పులను జేయ । తలిదండ్రులుగావకున్న
చనునాయిది న్యాయమయి । సరిగ జూడగ ఓనాధా। మీద ॥

హిర—తనయుడుగా వీడుమన । తలి దండ్రులశత్రువై మృత్యువై
జగతిబుట్టెను ఓప్రాణసఖి ॥ తన ॥

కడువడిగా నితనిజంపి । కక్షుదీర్చెద రాక్షసాది
ప్రముఖులంత మేలు మేలన । ప్రజ్ఞహెచ్చగ ఓప్రాణసఖి ॥ తన ॥

లీలా—పిచ్చిపుత్రుడనుచు నితని । పిలచిన పిలువగను వచ్చును
చచ్చువరకు సాధించిన సౌఖ్యమేమి ఓనాధా ॥ మీద ॥

హిర—యిటులబల్కె యెంతో యెంతో । వింత జేసి నావునీవు
భటులకడ్డ మిపుడుబడక । పదపద తొలగి ఓప్రాణసఖి ॥ తన॥

(అని నెట్టును) (అందరు నిష్క్రమింతురు)

లీలా—(దుఃఖముతో అంతిపురము ప్రవేశించి తనలో)

మ్రింగుటయం దపేక్షచే సర్పము చుంచెలుకను బట్టుకొని
అటు తర్వాత మ్రింగితినా! చచ్చిపోవుమనని విడిచితినా! కన్ను
లు పోవునని తెలుసుకొని దుఃఖముచే నా సర్పము భూమిపై
బడి తన్నుకొనువిధంబున నాపని యిపుడయినది.

గీ॥ పుట్టరేయాడు వారయి ♦ పుడమియందు
పట్టరే ప్రాణపతి నొక • పరిభలచరితు
బుట్టరే తనయులిటుల ♦ ముక్తికొరకు
పట్టరే శ్రీ హరిభక్తి ♦ పట్టుమిగుల.

కీర్తన.

మున్నెవరు జేసిరిటుల। యికనెవరు సేయగలరయ్యయ్యో॥ము॥

1. కన్నకుమారుని కరవాలముతో గోసి। గ్రన్నన రాక్షసులకు
   గావించమనె విందు ॥ మున్నె ॥
2. ఎంతజెప్పిన వినక । యింత జేసితివా తనయా
   కొంతయినదయలేక । కోపము జెందె మీతండ్రి॥ మున్నె ॥
3. ఆడుదయి పుట్టుట । అసలకె కష్టము
   తోడుదుడుకు మగడు । దుఃఖపెట్టు సుతుడు ॥ మున్నె ॥
4. నారాయణ రెడ్డినేలు। నాగశయనుని మాయ
   యెరికెయెఱుకవు। యిరుపురు వెరువురు ॥ మున్నె

హా! సర్వేశ్వరా! నా కొమరుని ఆవార్త వినకమునుపే నీ దరికి జేర్చరా? నీదరికి జేర్చుటకు సర్వాధాలను గానరాయా? ఇంత యాలస్యము జేసెదవు. కానియెడల యమునికయినా నీద్వారా వార్తబంపుము. నా యమలోకమునకు కూడా చాలని పాపినయితినా? నేనెచటనుండివచ్చితినో నచటకు మరలాబంపుము. నటులబంపుటకు వీలుగానా? ఇకను నన్నేమి సేయమనెదవు. నీవెంతబలుకకున్న నీసంగతి నాకు తెలుసును. అది యెద్దియనెదవా? సుఖదుఃఖములు సమానముగా జూడమనియె నీ యభిప్రాయము. సరే నిక చూడక నేమిసేయుదును. సేయున దేమియులేదు. (తెరబడును)

6వ రంగము—రాజనగరు.

(హిరణ్యకశిపుడువిచారపోవుచునొకపీఠముపైకూర్చొనియుండును)

(గజబలుడు, శతబాహు, ప్రహ్లాదుడు ప్రవేశము.)

గ—శ—హిరణ్యకశిప మహారాజా! ప్రహ్లాదుని మా కరవాలములచే

వేసినా, కోసిన పయిచర్మము యిన కందలేదు. అంతట నూరు కొనక చేయవలసిన పనులన్నియు జేసితిమి, చావలేదు. శ్రీహరీ యనుట మానలేదు.

హిర—ఏనుఁగులచే ద్రొక్కించితిరా!

గ-శ—ఆ.

హిర—మండుచున్న మంటలో వేసితిరా!

గ—శ—ఆ.

హిర—ఎండకుఁ, గాలికి, యుంచితిరా!

గ-శ—ఆ.

హిర—మంచులో నిలువబెట్టితిరా!

గ—శ—ఆ.

హిర—కొండపయినుండి క్రిందకు నెట్టి చూచితిరా!

గ-శ—ఆ.

హిర—కీలుకీలు యినుపబద్దెలతో బంధించి సముద్రములో నెట్టి చూచితిరా!

శత—స్వామీ! యిది చేసిచూడలేదు. ఈయుపాయము మాకు తెలిసినదికాదు. ఇపుడు జేసెదము గజబలా! ఆయుధ శాలకు వెళ్ళి యినుపబద్దె కొంత తీసుకొనిరమ్ము.

గజ—అలాగె తీసికొని వచ్చెదను. కాని, నా కాక లగుచున్నది.

హిర—అటులయిన లోనికేగుదము రండు.

శత—ఈవేళ్ల కావలసి నన్ని

గజ—ఏమిటె?

శత—అప్పచ్చులు కావలసినంత యీవేళ.

గజ — ఏమిటి?

శత — వేరుసెనగపప్పు. (అందరు నిష్క్రమింతురు.)

—: సముద్రము :—

శత — గీ॥ చూడుచూడుము సంద్రము ♦ చుక్కలంటి
వచ్చుచున్నవి తోణుకులు ♦ వరుసగాను
వానమబ్బులు వచ్చియు ♦ వ్రాలుచుండె
యేమిజెప్పుదు మీనముల్ ♦ మెగురుచుండె.

చూచితివా గజబలా! యీ సముద్రరాజము.

గజ — శతబాహు మనము వచ్చిన పని గానిమ్ము. ఆలస్యమయిన అమృతము విషమవునని పెద్దలు వక్కాణించియుండిరి.

శత — యిక నాలస్యమేమిలేదు. గజబలా! ప్రహ్లాదుని పడవైచి కదలకుండ పట్టుకొనుము.

గజ — (ప్రహ్లాదుని పడవేసి కదలకుండా పట్టుకొనును)
శతబాహు యినుపబద్దె కీలుకీలునకు కదలకుండా చుట్టి త్రిప్పి దోపివేయుము.

శత — అటులనే చేసెదను కదలనివ్వకు. (అని చుట్టును)

గజ — ధాన్యపు బస్తాకు చెయిగట్టినట్లు గట్టి యితని మన సత్తువ కొలది సముద్రములో విసరివేయుదము. (చెయిగట్టి శతబాహు చేతికందించును అలాచేతులుగట్టిసముద్రములోపడవేయుదురు)

శత — గజబలా! యిక వెళ్లుదమురమ్ము. యీసారితో ప్రహ్లాదుడుకడ.

గ-శ — (అని కొంచెము సాగివచ్చి వెనుకకు తిరిగి చూచుదురు.)

ప్రహ్లా — శ్రీసముద్రమారమణ గోవిందోహరిః.

గీ॥ హరిహరీయనినను పాప ♦ మంతమోదు
శ్రీహరీయన్న మించిన ♦ సిద్ధిగల్గు

విష్ణుదేవా యనినసీతి ♦ విద్యయబ్బ
మాధవాయన వైకుంఠ ♦ మందిరంబు.

(అని నాట్యము జేయుచు వచ్చును)

గజ——శతబాహూ, ప్రహ్లాదుడు చావలేదు. మనచావె నిజము. రాజు
గారియొద్దకు తీసుకొని వెళ్ళుదము పట్టుకొనుము.

( ఇరువురుపట్టుకొని రాజుయొద్దకు తీసుకొని వచ్చుచుందురు)

ప్రహ్లా-సీ॥ ఆదినారాయణు ♦ ననవరతమమది
చేరికొల్చిన నీవు ♦ శిక్షగాను
కామక్రోధాదులు ♦ కనుగొనుటకు లేక
పోవును యెటులనో ♦ రావుపైకి
యముని కింకరులగ్గి ♦ యమబాధలును బెట్ట
రాలేరువారింక ♦ రారురారు
మూలవ్యాధులుగూలి ♦ మూలకునోరుగును
ఆకలిదప్పులు ♦ నాగిపోవు

గీ॥ ప్రాణముల్ శాశ్వతముగావు ♦ భక్తిపదము
తప్పకుండగ నడువుము ♦ తప్పులేక
సుజనపోషకు డెప్పుడు ♦ జూచుచుండు
హారకుండలకేయూరు ♦ దారినడువు.

——: కొలువు :——

గజ——రాక్షసరాజా! ప్రహ్లాదు డిడుగో?

హిరణ——అటులా! చావ లేదా !

గజ——మేము చావవలసినదే.

హిరణ——వీరభటులారా! పాములవాండ్రను పిలిపించి క్రూర సర్ప

ములచే నీకురాత్ముని కరిపించుడు అందునా చావనియెడ నల్ల త్రాచుల విషము కడుపులోనికి, తరువాత వాడి హాని, గిరిని చూచెదను.

గజ—చిత్తమాలాగే? శతబాహు పాములవాండ్రను బిలిపింపుము.

(పాముల వాండ్రు.)

(మంత్రాల పెద్దరాముడు, తక్కిడి, బిక్కిడి, ఉక్కిడిగాడు, పీరుదాసు ప్రవేశము.)

మంత్రా— కీర్తన.

1. పాములవాండ్లమయ్య మేము। పాములవాండ్లమయ్య దొర్గారుసామి దండాలయ్య దండాలయ్య॥ పాము॥

గజ—యేమి పాములవాండ్లురా మీరు.

మంత్రా—అందుట్లోనె వత్తది చూచుకోవయో.

గజ—ఎందుట్లోరా!

మంత్రా—పాట్లోనే.

గజ—సరె పాడుము.

మంత్రా—బుడబుక్కల బుడబుక్కల ॥ పాము ॥

2. పాములోండ్లమయ్య మేము। పాకిపాకిబోవుచున్న । పామున యినబట్టుకొని పక్కలోనె పెట్టుకుందుం। చంకలోనె పెట్టుకొందుం ॥ పాము ॥

3. పెద్దపులుల చిర్తాగండ్ల । పేరుజెప్పి మంత్రంబెట్టి అడ్డలోనెయుంచుతాము । పొద్దునెత్తిదగిలిందాక॥ పాము ॥

శత—ఓరే! మీరెంతమందిరా అన్నదమ్ములు.

మంత్రా—అదిగూడా దాంట్లోనె వత్తదియో చూచుకోవయో.

శత.—సరే పాడుమురా!

మంత్రా—(చరణము)

4. నోరువెల్లు సుబ్బడు, తాటికాయ వీరడు, మంత్రాల పెద్ద రాముడు తిర్నాల కొండపాపడు, గారడీలముత్తడు, మూడు సోల్లకొండడు, తక్కిడిబిక్కిడి। ఉక్కిడిగాడు మేమందరము చక్కచక్క। ఒక్కదాంట్లొ పుట్టినాము ॥ పాము ॥

శ—ఒక్కదాంట్లొ బుట్టినామంటావు దేంట్లోరా.

మంత్ర—ఒక్క గుడిశలోనయో?

శత—సరె. వీటిలో నీపేరేమిరా!

మంత్రా—రెంటిమీద ఒకటియో?

శత—రెంటిమీద ఒకటేమిట్రా వెధవా.

మంత్రా—రెండుపేర్లు వచ్చినాకవచ్చింది చదువుకున్నవుగామాల్నె అంతమాత్రము తెలియదంటయో.

శత—మంత్రాల పెద్దరాముడా!

మంత్రా—కనుక్కున్నవే.

శత—రెండవవాని పేరేమిరా!

మంత్రా—తక్కిడిబిక్కిడి ఉక్కిడిగాడు అందరు పుట్టినాక పుట్టె.

శత—పాములకావడి మోయువాని పేరు.

మంత్రా—వాడు మాస్వంత మేనత్త కొడుకండె వాడెమ్మ చిన్నప్పుడు చానారోజులు పిల్లలు లేకుంటే పీర్లకు గుండముదగ్గర యుండి నాడాలెత్తిపడితే అందులో ఒకటివచ్చి తగిలిచ్చుకుంటె అప్పుడు బుడితే పీరుదాసు గాడంటె అదేపేరంటె సామే యింకొక్కరవ్వ విను.

శత — ఇంకొక్క రవ్వందిరా!

మంత్రా — పాట.

శత — ఏది కానిమ్ము.

మంత్రా — చరణం.

నారాయణ రెడ్డినెప్పుడు । నమ్మికముగా దల్చుకుంట
నాగస్వరము బాడుకుంట । నాగుబాము లాడిస్తాము ॥పాము॥

గజ — ఒరే! పాములవాడా! (అనిప్రహ్లాదుని జూపించి) యీతని నీ వద్దయున్న పాములచే కరువజేసి చంపగల్గుదువా?

మంత్రా — పాపమాయన నెందుకయో చంపేదో భక్తుడాలుందో.

గజ — రాజుగారా ప్రకారము శిక్ష జేసినారు.

మంత్రా — సరె అట్లయితె సామి దయ. ఒరే పీరుదాసు నిన్నబట్టిన నల్లత్రాచునిదియ్యర. (వాడాలాగె తీసియిచ్చును మంత్రాలపెద్ద రాముడా పాముని పట్టుకొని ప్రహ్లాదుని కరిపించబోవును.)

ప్రహ్లా — (కన్నులుమూసుకొని) హా! గరుడ గమనా హా! గరుడ గమనా (అని మరలమరల అనును)

(గరుత్మంతుడువచ్చి పాముని తన్నుకొనిపోవును.)

పా-వా — యిక మాచేతగాదయో! యీతనిజంపనో బొల్లిగద్దవచ్చి మాపామునే దెంకపోయిందయో మమ్ములగూడా దెంకపోద్ద యో. (అని ఉరుకుదురు)

గ-శ — రాజా! యిక నేమిసేయుమనెదవు చూచితివా!

హిర — లీలావతిని తక్షణము బిలుపింపుడు.

గ-శ — చిత్తము.

లీలా — (ప్రవేశించి తనలో)

గోరుచుట్టుపయి రోకటిపోటన్నట్లు మునుపే కృశించికృశించి చచ్చుదానను బిలిపించి కొమరునికి విషమునివ్వమని చెప్పుచుండె నా యందేదో గురిబెట్టుకొనియుండె నా భర్త.

హిర—ప్రాణసఖి. యీవిషపు గిన్నెను ప్రహ్లాదుని కివ్వుము నా మాట దప్పకుము.

లీలా—(భక్తితో నందుకొని)

హా సర్వసంకల్పసహితా హా సర్వమయ

గీ॥ సామజంబునుబ్రోచిన ♦ సాధుపోష
ఆర్తరక్షణ దయజూడు • నార్తితోడ
విషము నేనెట్లునిచ్చెద ♦ వెరువకుండ
దీని నమృతముగాఁజేయు ♦ దీనపోష.

నాకొమరునిచేతికి నెట్లునందిచ్చెద. భర్తయాజ్ఞ నెట్లుదప్పెద (అని తేలపోయి చూచుచుండును.)

ప్రహ్లా—తల్లీ! యేలచూచెదవు యిట్లునిమ్ము. (అని అందుకొని) శ్రీమద్రమారమణగోవిందోహరిః. (అని మ్రింగివేయును.)

(అందరు నిష్క్రమింతురు).





శ్రీరస్తు.

శ్రీ

# ప్రహ్లాద.

## తృతీయాంకము.

### ప్రథమరంగము—సభామంటపము.

(హిరణ్యకశిపుడు, ప్రహ్లాదుడు ప్రవేశము.)

ప్రహ్లా—శ్రీహరీ వైకుంఠవాసా! వరదాయక.

హిర—సీ॥ వలయునేవేళ్లలయందు ♦ వర్షించునింద్రుండు
భయముతో వర్తించు ♦ పావకుండు
గాలివీచుచునుండు ♦ క్రమముగా నెప్పుడు
యముడు నే జెప్పిన ♦ యాజ్ఞనుండు
వరరత్నముల దెచ్చి ♦ వరుణదేవుడు సదా
కానుకగా బెట్టు ♦ కావమనుచు
ధనదరాజు యితర ♦ దైవంబు గొలువక
నన్నుగొల్చుచునుండు ♦ న్యాయమనుచు

గీ। ఎండగాయుడు సూర్యుడే ♦ మండలమున
ఇంతయేటికి హరిని జూ ♦ పెంతవాడు
వానినిన్నును ఖండించి ♦ వసుధయందు
కీర్తిగాంచెద పాపాత్మ ♦ కీడుకోర్చి.

ప్రహ్లా—నాన్నా భక్తిచేత శేషుడు, సరస్వతి, బృహస్పతి, కైలాస

పతి, బ్రహ్మ, నారదాది దేవఋషులు యింద్రాది దిక్పతులును, నైరముచేత నీవు విచారించి హరి యింతవాఁడో యింత వాఁడో యెంతవాఁడో తెలియక విఫలులవుచుండిరి. నేనా? ఆ హరిని యింతవాఁడనిచెప్పుటకు సమర్థుఁడనా? అయినను నాకు తెలిసిన కొలఁది చెప్పిచూపెదను చూడుము.

సీ॥ సూర్యచంద్రులుమొదల్ ♦ చూడుసురాసురల్
మౌనులు మనువులు ♦ స్మరియించువాఁడు
ముప్పూరమూర్తుల ♦ మూలంబునకుమూల
కారణము నిజము ♦ గనగవాఁడు
సప్తసముద్రముల్ ♦ సప్తకులగిరులు
సప్తలోకమ్ముల ♦ సరణివాఁడు
పంచభూతంబులు ♦ పంచప్రాణంబులు
పంచవింశతితత్త్వ ♦ ప్రభువువాఁడు
గీ॥ పీఁడెబొమల సందుననుండి ♦ వెలుగువాఁడు;
వేదవేదాంతవేద్యుండు ♦ వేరెవాఁడు
వాఁడిగలసూది కొనమోప ♦ వలనుపడక
ఏడఁజూచిననుండునా ♦ తోడువాఁడు.

హిర—(కోపముతో) ఒరే! పాపాత్మ.

కీర్తన.

సుద్దులు జెప్పెవేలరా । చూపుము నీహరియెచ్చటరా
ప్రహ్లా—అడ్డయులేకను నాహరి । అంతటనుండును జూడుమురా
హిర—మాటకుమాటను వేసెదవా । బూటకమని హరివిడచెదవా
ప్రహ్లా-మాటకుమాటకు పెంపకమె । మానను శ్రీహరి నామము నే

హిర—హరి అంతటఁగలడని వదరుచుంటివి నీ హరిని నీ స్తంభమున జూపెదవా! నటుల జూపకున్న నీశిరము నుఱిచి భూత భేతాళ గణంబులకు బలిజేసెద నిన్ను రక్షించువాడెవడో చూచెద.

(అని ఖడ్గంబు కేల నమర్చి జళిపించును)

ప్రహ్లా—జనకా! బ్రహ్మ మొదలుకొని గడ్డిపోచవరకు విశ్వాత్మ కుడై వెలయుచున్న హరి నివిపులమగు స్తంభమున నేలయుండడు? తప్పకయుండును.

హిర—(రౌద్రాకారమున) హరి యిందుగలడా! యిందుగలడా! చూపెదవా! చూపెదవా (అని సభామంటప స్తంభమును చేతి తో జూపును)

ప్రహ్లా—సందేహము లేదు.

హిర—సందేహము లేదా! (అని అర చేత నా స్తంభము మోగునటు ల నేయును.)

(నృసింహమూర్తి నా స్తంభమున ఛటచ్ఛటస్ఫటస్ఫటద్ధ్వనులతో నావిర్భవించును.)

నృ— కీర్తన.

నిలునిలుము రాక్షసాధమ। నిక్కముగ నిన్ను బట్టి
డొక్క జీల్చి ప్రేవులన్ని। ఒక్కసారి మెడను దాల్చెద ॥ నిలు ॥

హిర—పోకు పోకు నారసింహ। పొడిచినాకు కత్తి చేత। వడిగ వచ్చు రక్తమంత। వదలకుండ త్రాగెదను। కదలకుండ త్రాగెదను॥ పో॥

నృ—రార రార రక్కసుండ.

హిర—రార రార నారసింగ.

నృ—(హిరణ్యకశిపుని వడిచి పట్టుకొని తొడలపయి నుంచి గోళ్ళ తో పొట్టచీల్చి వేయును. ప్రేవులు తీసి మెడలో దాల్చును)

(రాక్షసులు ఆ సమయమున నరసింహ స్వామి పయి యుద్ధమునకు పొమ్మని క్రమ్మ నారి నందరిని తరిమిచంపి శ్రీ స్వామి వారు సింహాసనముపై కొలువుదీరును.)

(బ్రహ్మ ఇంద్రుడు ప్రవేశించి)

కీ ర్త న.

శరణు శరణు నారసింహ । శరణు నీకుశరణు తండ్రి ॥ శర ॥

1. నరగుననీయుగ్రజాల । సమితినాపకున్న జగములు
సమసిపోవుసత్యముగను । సదయ నేలుయియ్యెడను ॥ శర ॥

2. భువనంబులు భవనంబులు । పురములు కాల్పట్టణములు
దివిరవిశశిమునులు మేలు । దేవ నీమహిమాతిశయము ॥ శర ॥

3. భండనమున శత్రుజంపి । ప్రభలుచుంటివి కొలువునందు
ఎండగాయు యేడుకోట్ల భూ । మండలమునకుప్రభూ । శర ॥

4. నారాయణభక్తుడు సదా । నమ్మినని మ్మనుసుపాద
పారాయణభాగ్యముమము । బాయకుండునటుల జేయుము ॥ శ ॥

ప్రహ్లా—

దండకము.

ఓభక్తమందార నీదాసదాసుండ నీపాదపద్మంబు లేవేళ నే గొల్తు నీయుగ్రరూపంబు బ్రహ్మదిగీర్వాణులే జూడజాలంగ లేరైరి నేనెంతవాడన్ దయాసాంద్ర నీభీకరాకారమౌ మూర్తి శాంతించి నన్నున్ కృపంజూడు నాతండ్రి మూఢుండ నజ్ఞాన గాఢాంధకారంబు లోజిక్కి యేదారిగానంగ లేకన్ మహాతాపముల్ జెంది యున్నాడ వైకుంఠవాసా! నమస్తేనమస్తే నమః.

(అని అంజలిపుట్టుండై నిలువబడును.)

నృ—ప్రహ్లాదా! నీభక్తికి మెచ్చితిని యేమికావలయునో అడుగుము యిచ్చెదను.

ప్రహ్లా.—స్వామీ! నీకటాక్షవీక్షణాలంకృతమగు కృపయే నాకు చాలును. అయినను మీరొసఁగెదనన్న నే కోరని యొకవరము గర్వించిన వాఁడనగుదును గాన కామములు వృద్ధిఁ జెందనివరంబు దయచేసి రక్షించుము.

నృ.—సరే. ప్రహ్లాదా! నీయభిప్రాయముం గనుంగొంటిని మన్వంతర కాలంబువరకు రాజభోగముల ననుభవించుచు నాభక్తుల నన్నుగా భావింపుము. అటమీఁద కాలవేగంబున కళేబరంబు విడచి దశదిశ వ్యాప్తిఁ జెందు కీర్తితో మోక్షసామ్రాజ్యాభిలాషుఁడవై భక్తితో నన్నుఁ గలసెదవుగాక.

ప్రహ్లా.— దేవా! యింకొక్కమనవి మాతండ్రి యగు హిరణ్యకశిపుఁడు తనతమ్ముని నీవు యజ్ఞవరాహమవై చంపితివను కక్షచే నీపైని వైరమెత్తి నాకపకారంబు లొనరించి నీచే నేఁడు మృతిబొందెను. నాతని యాత్మ పాపసముదాయములను విడిచి పరిశుద్ధాత్మ మగునటుల దయసేయుము.

నృ.—యిక రెండుజన్మములకు నాతనియాత్మ పరిశుద్ధిఁ జెందు.

ప్రహ్లా.—స్వామీ! చాలాదూరపు గడువుబెట్టితి రేల

నృ.—ఔను. అదిమహామునుల శాపము తప్పదు.

ప్రహ్లా.—హాహా పదునాల్గులోకముల సృష్టింప బెంప, చంప, శక్తిగలవాఁడై యుండియు హరిభక్తులమాట నిలువబెట్టుటయందు ఎంతదయ ఎంతదమ అట్టి మహానీయ్యుఁడు గాబట్టి యిట్టినన్ను,

గీ॥ వంశమునకు రాక్షసుఁడను ♦ బాలకుఁడ నె
రుగను సత్ప్రవర్తనము ♦ సరగునవరము
లిచ్చిబ్రోచె నీపూజ్యుని ♦ యెన్నదశమె
సుజనసముదాయ హితులార ♦ సుమతులార.

బ్రహ్మ—ప్రహ్లాదా! యీకార్య మత్యాశ్చర్య మైనదికాదు. యీ మహానీయునకు మత్స్యావతారమెత్తి సముద్రములో జొచ్చి సోమకాసురునిజంపినాఁడు వేదంబుల తీసుకొని వచ్చి నాకునొప్పగించె సురాసురులు మందరగిరిదెచ్చి అమృతముకొరకు పాలసముద్రము తరచుచుండ నాకొండ మునుగకుండ కూర్మావతారమెత్తి వీపుపైననిల్పి వారల కమృతమునిచ్చెను. అంతట నూరుకొనక జగన్మోహినీరూపమయి రాక్షసులకు యమృతము నందకుండా దేవతలకు నిచ్చెను. అది జరిగినపిమ్మట యజ్ఞవరాహరూపమెత్తి మీపినతండ్రిని చంపి భూమిని చక్కపరిచెను. ఇక నెన్ని యవతారములు భక్తులకోసర మెత్తవలయునో నీమాహానీయుడు మనకు తెలియదు.

యింద్రు-కమలాసనా! భక్తుల యందు జ్ఞానుల యందు విరాగుల యందు భగవంతుడే యింత ప్రేమమయుడై యుండ కవులు కొందరు వారినిగూర్చి హేళనగా వ్రాసెదర దేమి.

బ్రహ్మ—అవును వారికవిత్వము చూచుటకు, వినుటకు, తదితరులకు సొంపుగాను రుచిగాను యుండవలెనను నభిప్రాయముతో వ్రాయువారుగలరు. ఓరుచలేనితనముచే వ్రాయువారు గలరు. యెవరేమనుకొనినను నాకవిత్వము ఈశ్వరుడిచ్చిన బుదికొలది మంచిగావ్రాయవలెననువారు గలరు. నిక యీకవులలో ననేక తరగతులవారుగలరు. వారివిషయము నేజెప్పుటకు సాహసింపవలనుపడదు. వచ్చె వైకుంఠపు కాదశికి సత్యలోకములో మన యింటనే భక్తసమావేశమప్పుడు నా సమావేశములో కవుల చర్చవచ్చును. అప్పుడు సరస్వతీదేవి లేచి యేయే యభిప్రాయముల నొసగు కవులు యేయే తెగకు జెందెదరో చక్కగా

నుపన్యసించును. అచ్చటకు నీవు వచ్చిన వినవచ్చును.

యింద్రు—సరే మంచిది మంచిది.

నృ—కమలాసనా! యిట్లురమ్ము.

బ్రహ్మ—స్వామీ! చిత్తము. (అని దగ్గరకుబోవును.)

నృ—యీహిరణ్యకశిపునకు యిచ్చినటువంటి వరముల యెప్పుడయినా! ఎవ్వరికయినా యివ్వకుము.

బ్రహ్మ—స్వామి ఆజ్ఞఆజ్ఞ.

ప్రహ్లా— కీర్తన.

స్వామీనరసింహ సత్యముగనినుబాసి । జగతిని యీవిషయ సౌఖ్యము నేనొల్ల ॥ స్వామీ ॥

1. శ్రీలక్ష్మిమీసేవ సేసియులసిన । జేసెదమీసేవ చిత్తగింపుముదముతో ॥ స్వామీ ॥

2. నీభక్తుడు నారాయణ నిజముయీమాటన । నాభక్తినిగను గొనుము న్యాయమునీకయిన ॥ స్వామీ ॥

నృ—భక్తవరా! నేచెప్పినవరకు నిచ్చుటనేయుండి నిఖిలసుఖముల వడయుటే నాకు న్యాయము.

ప్రహ్లా—చిత్తము.

నృ—కమలాసనా! ప్రహ్లాదుని స్వరాజ్య పట్టాభిషిక్తుని జేయుము.

బ్రహ్మ—ఆలాగె. (అని ప్రహ్లాదుని సింహాసనముపయి గూర్చుండ నియమించి) సూర్యచంద్రులు మాయునప్పటికిన్ని నీవు మాయక చిరంజీవివై మనెదవుగాక. (అని మెడలో బూలదండవేయును.)

నృ—యిం—శుభం శుభం.

(ఆసమయమున ఆకాశమునుండి పూలవర్షము గురియును)

బ్రహ్మ — ప్రహ్లాదా! కష్టములకోర్చి హరిభజన విడువక పరమ భాగవత శిఖామణివయి బరగితివిగాన,

గీ॥ నీనుచారిత్రమెవ్వరు ♦ నిత్యభక్తి
వినెదరు చదివెదరొ వారు ♦ విశ్వమందు
యున్నసుఖముల వడయుచు ♦ రున్నవరకు
అంత్యమున హరిగలసెద ♦ రందుగాక.

ప్రహ్లా—

మంగళహారతి.

మంగళంనరసింహ మంగళం మమదేవ మంగళం వరదాయ మంగళంబు మంగళం ఓంనమోనారాయణాయ మంగళంభక్త జనమందార తేజాయ। జయజయ ॥ మంగ ॥

1. ముజ్జగంబులుమాయ మూలమేనీవాయ। సజ్జన విధేయను సమరంబాయ రజ్జులేలనుయింక। రారాజులేమాయ రక్ష నీ వైకుంఠ రాజ్యమాయ జయజయ॥ మంగ॥

2. శ్రీసంతగుడిపాటి చిద్విలాసాయ। చివరకునీమాయ దెలియ దాయ దాసదాసులబ్రోచు దైవము నీ వాయ। దయతోడ మమ్మేలు ధర్మమాయ। జయజయ ॥ మంగ ॥

(అందరు నిష్క్రమింతురు.)

(తెరవాలును)

ఇది

శ్రీ ప్రహ్లాద నాటకము.

తృతీయాంకము

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

